Registered No. M. 4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] మద్రాసు. 1942-వ సం॥ ఏప్రిల్ నెల 17-వ తేది శుక్రవారం [నె 15 రు.

## మదరాసు తయార్

మదరాసు నగరం యీ వారము కవచము ధరించుచున్నది. రోడ్లనిండా ఆయుధ మోటారులతో సైనికులు తిరుగుచున్నారు, రంగుపూతలు వేయబడిన మోటారుబండ్లు అనేక సైజులవి అనేక రకాలవి ప్రతి మారుమూల తిరుగుచు, వరుసగా వీధుల వెంబడి పోవుచు బ్రిటిషు సైనిక శక్తికి ప్రదర్శనములుగ నున్నవి, పొడుగాటి సన్నని ఫిరంగి మూతులు అనుకోనిచోట్లనుండి పొడుచుకవచ్చి అగుపడుచున్నవి; బ్రిటిషు సైనికుల తెల్లని నవ్వుముఖాలు ప్రతిచోట కనబడుచు, చొక్కాలు విప్పి ఎండలో పనిచేయుచు, వింతగ జూచు ప్రక్కవారితో హాస్యాలాడుచున్నవి.

జపాను శత్రుచర్యలు యిదివరకు కన్న మనకు చేరువై ప్రమాదం దగ్గరపడిందని ప్రకటించుట అవసరముగా శనివారంనాడు ప్రభుత్వము వారికి తోచింది. అందుచేత యీ ఊరులో ఉండవలసిన పని లేనివారందరును, అగత్యముగా ఉండవలసినవారి రక్షణ పూచీగలవారి పనికి అడ్డులేకుండా, తొలగి పోవాలని ప్రభుత్వమువారు తెలిపిరి. ఇందుకు కొందరు కినియుట మామూలే. ప్రజలను పంపివేయుట యిదివర కెన్నడో చేయవలసిందని కొందరన్నారు, ఇతరులు, ప్రభుత్వకార్యాలయాలు బ్యాంకులు కదిపివేయడానికి యింకా వ్యవధియుందని, యిపుడే పంపివేయుటచే ప్రజల ధైర్యం చెడుతుందని అన్నారు.

పదిరోజులక్రిందట దాడి హెచ్చరిక చేయబడినపుడు ఏమిజరుగకపోవుట చాల ఆశాభంగము కలిగించింది. తరువాత ఢిల్లీలో రాయబారాలు విఫలమైనట్లు విచారకరమగువార్త వచ్చెను. ఇపుడు మరల యుద్ధచర్య సూచనలు గరళింపడ్డట్లు పడుతున్నాయి. "వెధవ రాజకీయాలు" అని మదరాసులో మనం విసుక్కుంటాము. "మన కిక్కడ పనివుంది చేసుకోగలమో లేదో తెలియదు" అనుకుంటాము. జపాను చెప్పే "సమాన అభివృద్ధి ప్రాంతీయవాదము" గూర్చి సింహాళం ఏమనుకుంటున్నదో కొలంబోపై దాడిచేసినపుడు శత్రువుకి తెలిసివచ్చింది. మనకూ అట్టి అభిప్రాయమే గలదని, మీతో పనిలేదని కొలంబో చెప్పినట్లే మదరాసుకూడ చెపుదాము.

జపానీయులు కొట్టకపోతే మంచిదే; కాని వారు రావడమేవుంటే భారతీయుడు, ఆంగ్లేయుడు, ఆఫీసరు, గుమాస్తా, యజమాని, కార్మికుడు, సైనికుడు, సహాయకుడు అందరు కలసి మన సహాయానికై అపుడే యిక్కడకు వచ్చియున్న త్రివిధసైనికదళముల నిపుణులగు యోధులకు వీరులకు తగిన సహాయంచేయుదురనుటకు ఎట్టి సందేహంలేదు.

రాజకీయాభివృద్ధికి, ప్రజాధర్మనిరతికి మతసహనమునకు చరిత్రలో మదరాసు వన్నెకెక్కియున్నది. ఇపుడు యింకా క్రొత్త పరీక్షసమయం వచ్చింది. కనుక సురక్షితులైన రెడ్ క్రాసువారి స్వార్థరాహిత్యము, ఎ. ఆర్. పి. వారి అగ్నిదళములవారి సమర్థత పట్టుదల, ప్రజల దేశభక్తి, గవర్నరుగారి శ్రద్ధగల నాయకత్వము యివన్ని గూడ యీ రాష్ట్రపు ప్రతిభను యెక్కువ చేయగలవు.

# యుద్ధవిమర్శ—విశేషాలు

**సింహళంపై దాడి**

సింహళముపై సాగించిన మొదటిదాడియందు జపాను పూర్తిగ ఓడిపోయెను. ఈస్టరు సెలవులలో ఆదివారం నాడు యీ దక్షిణ దీవియందు దిగుటకు మొదటి యెత్తుగ జపాను విమానాలు దాడిచేయగా చాల నిరుత్సాహకరమగు సన్మానం జరిగెను. ఒక యుద్ధ నౌకపై నివాసమున్న 75 యుద్ధ విమానాలు కొలంబోపై దాడినచ్చినవని అడ్మిరలు సర్ జఫ్రీలేటనుగారు (సింహళము సేనాధిపతి) తెలిపిరి. శత్రువుల విమానవాహకనౌక ఆ ప్రాంతములో ఒక్కటే ఉన్నయెడల అది కాగా అనో లేక అకాగి అనో పేరుగలదై యుండాలి. వీటిలో ఒకటి 60 యింకొకటి 50 విమానాలనుమాత్రమే మోయగలదు. కావున, 75 సరిగాకొలంబోకి వచ్చియుంటే, ఆ నౌకపై మొయ్యలేనంత బరువుంచేరన్నమాట జపాను విమానాలు యుద్ధ నౌకపైనుండి వచ్చియున్నాయని ఖచితముగాచెప్పుతున్నారు కనుక, అవి జపాను క్రొత్తగ ఆక్రమించుకొనిన అండమాను దీవులనుండి వచ్చియుంటాయని అనుకోవలసిన పనిలేదు. అండమాన్సు కొలంబోకు 940 మైళ్ల దూరంలో వున్నాయి.

ఇంతవరకు జపాను విమానాలు తమ నివాసము నుండి 400 మైళ్లకు మించిన దూరముపోయి దాడి చేయలేదు కొలంబో దాడిచేసిన విమానాలను మోసిన యుద్ధ నౌక కనీసం 2500 మైళ్లు చుట్టు తిరిగి వచ్చియుండును. విమానవాహకనౌకలు ఒకే చోట ఎక్కువకాలం ఉండలేవు. ఉంటే మిత్రమండలి విమానాలు కనుగొని ముంచేస్తాయి, లేదా యుద్ధ నౌకలువచ్చి పైబడతాయి. కనుక అవి బంగాళాఖాతంలో తిరుగుచు ఇండియాతీరపు నగరాలపై దాడి జరుపుటకు ప్రయత్నించి మరీ స్వస్థానమునకు పోగలవు.

కొలంబో చాల అద్భుతముగా దాడి నెదిరించింది. కొలంబో చాల ప్రధానమయిన నగరం. ఇండియా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలను కలుపు సముద్ర మార్గములు కొలంబోమీదుగ పోతాయి. సాధారణ సమయములందు యీ రేవులోకి బ్రిటిషు ఇండియా రేవులన్నింటిలోకి వచ్చు స్టీమరులకన్న ఎక్కువ స్టీమరులువచ్చును. సింహళం పడమటి తీరాన కొంచెం దక్షిణంగా కొలంబో రేవుగలదు, తూర్పున ట్రింకోమలీరేవునందు బ్రిటిషువారి నౌకాదళం డిపోయు చమురు గిడ్డంగులు గలవు. దానిపై గూడ శత్రువులు దాడిచేసిరి. హిందూ మహాసముద్రమునందు భద్రముగ రక్షింపబడుచున్న నౌకాశ్రయములలో యిదియొక ప్రధానమయినది. తూర్పుదీవుల నౌకాదళమున కిది కేంద్రస్థానము.

సింహళముపై ప్రథమదాడిలోనే జపానీయులు ఓడిపోవుటబట్టి యీ దీవి బాగుగ రక్షింపబడు చున్నదని చెప్పవచ్చును. ఆయుధాల రక్షణయే గాక, ప్రజల శ్రద్ధాభక్తులతోగూడ ఎక్కువ రక్షింపబడుచున్నది. సివిలు ప్రజలు వారి బాధ్యతలను వారు బాగుగ గుర్తించిరి. అదివరకు సింహళం టైమ్సు పత్రిక సహాయ సంపాదకుడుగనుండిన జె. టూడరు జేమ్సుగారు, యీ విషయంగూర్చి యిటీవల యిట్లు దెలిపిరి :—

“సింహళమును వదలుకోరాదు. ఎందుకంటే ఇండియా రక్షణ విధానమునందు అది చాల ప్రధానమైనదేకాక, ముందు సమయం వచ్చినపుడు మనం తూర్పువైపు దాడిపోవుటకుగూడ యీ దీవి ప్రధానంగా నుండగలదు జపానువారు దీనిపై దాడి చేయగలరని తెలిసియే కొన్ని వారాల క్రిందట వైసు అడ్మిరలు సర్ జఫ్రీలేటనుగారు సింహళములో ప్రజలకు సైన్యానికి నౌకాదళానికి విమానదళానికి సర్వసేనాధిపతిగా నియమింపబడిరి. ఈ తీరాన నౌకాయుద్ధం జరుగుతుందని ఊహించియే నౌకాదళోద్యోగిని సర్వసేనాధికారిగ నియమించిరి. నేనచట వాలంటీరు డిఫెన్సు ఫోర్సునందు 5 సంవత్సరాల క్రిందట పనిచేసితిని, అపుడే మేము యీ రీతిగ జరుగునని ఊహించియుంటిమి. జపాను సేనలు వచ్చి దిగుచున్నట్లే ఎంచి అనుభవంగడించుటకు రక్షణకార్యములు చేయుచుంటిమి. మా ఐచ్ఛికరక్షణ దళంలో యూరోపియను జట్టుతోబాటు యితర జాతుల జట్లుగూడ యుండెను. అందరు సైన్యానికి కావలసిన సహాయం అంతా చేయుచుండిరి.”

**ఆస్పత్రిలో రోగులు చచ్చుట**

సింహళంపై జరిగిన విమానదాడివంటివి గాలివాటుగా వచ్చి పోవలసినవే గాని స్థిరమయినవి గావు. నేలనుండివచ్చే విమానాలయితేనే స్థిరంగా నిలకడగా దాడిజేయగలవు. జపాను విమానాలు మొత్తం 39 టన్నుల బాంబులు వేసినవి కేవలం మిలిటరీ వస్తువులపై సైనిక శిబిరాలమీద మాత్రమే వేయలేదు. మొదటి విమానదాడిలో చనిపోయినవారిలో సగానికిపైగా ఆస్పత్రులలోనున్న రోగులే. ఈ దాడియందు జపానువారి విమానాలు ¼ వంతో ⅓ వంతులో

నాశనమయినవి. దానినిబట్టి సింహాళం రక్షకుల ప్రతిభ తెలియగలదు.

రక్షణవిధానం చాల కట్టుదిట్టములు కలిగి యున్నచో శతృదాడులకు ఏమాత్రం భయపడ నవసరంలేదని సింహాళం ప్రథమదాడి మనకందరకు నేర్పే గుణపాఠం. సింహాళ సర్వసేనాధికారి సర్ లేటనుగారు దానిగూర్చి యిట్లు తెలిపిరి —

"మేమింత తేలికగ తప్పించుకొనుట కేవలం అదృష్టంవల్లనేకాదు. ఈ ప్రమాదాన్ని ఎదుర్కొనుటకు బాగుగ తయారయి యుండుటయే కారణము. ఈ శ్రద్ధ మేము తగ్గించనంతకాలం, స్థిరచిత్తంతో జయించాలను పట్టుదలతో భీతిచెందక కృషిచేయునంతకాలం, ముందుస్థితినిగూర్చి మాకెట్టి భయంలేదు."

మదరాసు నగరంలో ప్రజలును, యీ రాష్ట్రంలోనుండు సముద్రతీర నగరాలవారును, సింహళంపై ప్రథమదాడివలన గుణపాఠం నేర్చుకొని, ఎటువంటి ప్రమాదాన్నైన ధైర్యంగా నెదుర్కొనుటకు సిద్ధంగానుండాలి.

ఈ మహాసంగ్రామమునందు వీరప్రధాన్యమగు

**బటాను యుద్ధం**

యుద్ధం ఒకటి గతవారం ముగిసింది. బటాను యుద్ధం పూర్తియైనది. ఫిలిప్పైను దీవులలో ఒక ద్వీపకల్పం, బటాను. దీని రక్షించుచున్నవారి సంఖ్యను మించిన జపాను సైన్యం (135,000) దీన్ని ముట్టడిచేసెను. చిట్టచివరకు జపాను నౌకలే గెలిచినవి. బటాన్ను రక్షించుచున్న అమెరికను సేనాని వైను రైటుగారు అధ్యక్షుడు రూజువెల్టుగారికి పంపిన సందేశంలో యిట్లు దెలిపిరి. ఉన్న కొద్దిమంది సైనికులతో ఎంతవరకు కాపాడాలో అంతవరకు కాపాడినపిమ్మట, అలసి ఆకలితోనున్న సైనికుల సంఖ్యను మించిన శత్రుసైన్యం విమానదళం ఫిరంగిదళం వచ్చిపడుటచే, విడువవలసి వచ్చినదనిరి. చిన్న అమెరికను సేనపై జపానుసైన్యాలు మూడుదండులు వచ్చిపడినవి. ఒకరికి ఎనమండుగురు చొప్పున అధికముగా యున్న శత్రువులను ఎదుర్కొని యంతకాలము నిలచిన వీరులను అమెరికా పత్రికలు పొగడినవి. కాని యీ చిన్న సైనికదళం గెలువలేకున్నా యింతకాలం నిలువరించుకొని యుద్ధం కొనసాగించుట సైనికంగా గొప్పలాభం చేకూర్చెను. ఇతర పసిఫికురంగములందు, ముఖ్యంగా ఆస్ట్రేలియాయందు అమెరికా సైన్యాలను దిట్టంచేసుకొనుటకు అవకాశమిచ్చెను. బటాను యుద్ధం ప్రాముఖ్యత గూర్చి అట్లాంట కాన్‌స్టిట్యూషను అను పత్రిక యిట్లు వ్రాసెను —

"బటానుసైనికులలో ప్రతివానిపేరు అమెరికా వీరుల జాబితాలో చేర్చదగినదే. అమెరికా సైన్యం వేరొకచోట వృద్ధిచెందుటకు వారు అవకాశమిచ్చిరి. ఆస్ట్రేలియా దేశం వారికెకృతజ్ఞత తెలుపవలసి యుండును. మిత్రమండలి దేశాలు యిటీవల పొందిన కొన్ని ఓటములలో బటాను ఎన్నదగినది. అమెరికాసేనలు మరువరాని వీరగాథ బటాను యుద్ధం."

జపానుసేనకు యిటీవలి యుద్ధంలో చాల నష్టం కలిగింది. 55 ఫైటరు విమానాలు కూల్చబడినవి. 46 సేనల గొంపోవు నౌకలు, 16 యుద్ధనౌకలు ముంచుటో చెడుటో జరిగెను. నాలుగువైపులా ఐదునెలలు తీవ్రయుద్ధం జరిగెను. దానిలో జపాను గౌరవం చెడింది కాలం శ్రమ వృధా అయినవి. జపాను సేనానాయకుడు హొమ్మగారు ఆత్మహత్య చేసుకోడంబట్టే, జపానీయులు యీ యుద్ధపరిస్థితుల నెట్లు గుర్తించుచున్నారో తెలియగలదు. అతని స్థానేవచ్చిన సేనాని యొమషిట్సుగారు, జపానుకు యితరచోట్ల చాల పనియున్నపుడు, హాంకాంగునుండి మనిల్లావరకు 4000 మైళ్ల పొడుగున యుద్ధ యత్నాలు చేయుచున్నపుడు బాధ్యతవహించిరి. అమెరికాసేనను ఓడించలేకపోయి ఆత్మహత్య గావించుకొన్న హొమ్మగారి స్థానేవచ్చిన యమషిటగారు 16 దినములలో ఆ పని ముగించవలసి వచ్చినందున బటానుపై లెక్కలేనంత సైన్యాన్ని పంపి తీవ్రతరమగు దాడి జరిపిరి.

బటాను ద్వీపకల్పం శతృవశం కాగానే అంతా పోయిందనుకోరాదు. ఫిలిప్పిను దేశీయులు యుద్ధం కొనసాగింతురు. వారిలో యుద్ధవాంఛ మిక్కుటంగా నుంది. లుజాను లోయలందును, కారిగిడారు కోట నుండి వారు శతృనిరోధం చేయుచునే యుందురు. జపాను ఆక్రమించిన ప్రాంతం నుండి అనేక మంచి ఫిలిప్పినుదేశీయులు జపాను పాలన యిష్టములేక బటానులోనికి పారివచ్చినందున, ముట్టడియందున్న బటానులో తినుబడి వస్తువులు చాలకపోయెను. అమెరికను సైనికులకు జనవరి నుండి ఆహార పదార్థములు చేరలేదు. అందుచే వారికి చావకుండా ఏదో కొంచెం తిండి పడేస్తు వున్నందున, తిరుగు దాడిచేయజాలక పోయిరి. కాని తిండిలేకున్నా బటానురక్షణ మానకుండుటచే మిత్రమండలికి అత్యవసరమగు వ్యవధి లభించెను.

"చావ సిద్ధంగా నున్నవారే జీవింప నర్హులు" అని మెకార్థరు సేనాని ఆదర్శవాక్యాని కనుగుణ్యంగ బటాను సైనికులు ప్రవర్తించిరి.

# ఇండియాలో నౌకానిర్మాణం

### 300 స్టీమరులు తయారగుచున్నవి

### యుద్ధంవలన అభివృద్ధి

ఇండియాలోనున్న నౌకానిర్మాణపు రేవులన్నింటి యందు యిపుడు యుద్ధానికి కావలసిన వివిధరకముల నౌకలు నిర్మింపబడుచున్నవి. ట్రాలరులు, కార్వెటీలు, లాంచీలు, మందుగనుల తుడిచే మోటారు నావలు, మోటారు లాంచీలు, లైఫ్ బోట్సు, స్టీమరుల వెనుక కట్టబడి మందుగుండ్లను ప్రేల్చే సిండ్సు, మున్నగు రకాలన్నీ 300 పైగా నిర్మింపబడుచున్నవి.

ఇవిగాక, వర్తక నౌకలు, మరమ్మతుల కుపయోగించే ఫ్లోటింగు డాకులు నిర్మింపబడుచున్నవి. ఈ రెండు పరిశ్రమలు అపుడే చాల అభివృద్ధి చెందినవి.

ఈ దేశంలోనున్న వివిధ నౌకానిర్మాణ శాలలందు 30,000 పైగా పనివారు నియమింపబడిరి.

క్రొత్త నౌకలను నిర్మించుటేగాక అనేక రకాల మరమ్మత్తులుగూడ జరుగుచున్నవి. సుమారు 4000 పెద్ద నౌకలు యుద్ధం ప్రారంభమయినప్పటి నుండి ఇంతవరకు ఇండియా రేవులలో మరమ్మత్తు చేయబడినవి.

స్టీమరు ఇంజనుసామగ్రి ప్రొపెలింగుయంత్రాలు ఇండియా ఇంజనీరింగు ఫాక్టరీలలో తయారగుచున్నవి. త్వరలో ఇంజనులుకూడ తయారుకాగలవు. నౌకలలో అమర్చే పరికరాలు యుద్ధానికి పూర్వం ఇతరదేశాలనుండి వచ్చేవి యిపుడు ఇచటనే తయారు చేయబడుచున్నవి. లంగరులు, విండుగ్లాసులు, మందుగనులను తెగగొట్టే పరికరాలు, గాలికిటికీలు, రంగుల అద్దాలు, ఎలక్ట్రికు సామానులు అనేకం ఇచట తయారగుచున్నవి.

కాని బాయిలర్లు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తియంత్రాలు, సబుమెరైనులను కనిపెట్టే యంత్రం, నిద్ద ఉక్కు, రాగి ఇత్తడి గొట్టాలు, ఆకర్షణలేని రేకు, కవచపు రేకు యింకా విదేశములనుండే రావలసియున్నది.

ఇండియా నౌకాపరిశ్రమ యింకను శైశవావస్థ యందే యున్నది, యుద్ధానికి పూర్వంకన్న బాగా అభివృద్ధిచెందినది. అపుడు ఇండియాలో చిన్న కర్ర ఓడలు ఉక్కుపడవలు తయారుచేయుట, వర్తక నౌకల మరమ్మత్తు తప్ప యింకేపని యుండేదికాదు. యుద్ధానికి పూర్వం నదులలో పోయేనావలే ఇండియాలో తయారయ్యేవి. వాటికిని సముద్రాలపై పోయే పెద్దనావలకు మరమ్మత్తుమాత్రం నౌకానిర్మాణశాలలందు జరిగేది.

యుద్ధం వచ్చుటవలన, నౌకలు చాలనందున ఇండియా రేవులలో ఎంత ఎక్కువ నౌకలు నిర్మింపవచ్చునో అంత ఎక్కువ నిర్మింపబడుచున్నవి. ఈ పరిశ్రమకు ప్రాముఖ్యత వచ్చెను. తూర్పు యుద్ధరంగాలన్నింటికి ముఖ్య సప్లై కేంద్రంగా ఇండియా పరిగణింప బడుచున్నందున, యుద్ధసహాయ కార్యములందు యీ పరిశ్రమకు ప్రాముఖ్యత మరింత అధికమైయింది.

---

# అమెరికా—జపాను నౌకాదళముల తారతమ్యము

### సంఖ్యలోను, ఆయుధబలములోను అమెరికాదే ఎక్కువ

జపానుయొక్క నౌకాబలముగూర్చియు క్రొత్తగ కట్టుచున్న యుద్ధ నౌకలనుగూర్చియు సమాచారము అతి రహస్యముగ నుంచబడుచున్నది. అమెరికా నౌకాదళ శక్తి నెదిరించుటకు యిదే మంచిసమయము, ఆఖరు అవకాశమని ఎంచి జపాను యిపుడు అమెరికాతో డీకొన్నది. అమెరికా నౌకాబలముతో జపాను సరితూగుట కెంతోకాలము పట్టును.

ఆయా దేశాల నౌకాబలము తెలుసుకోవాలంటే వాటి యుద్ధ నౌకలు ఎన్ని యున్నవో, వాటిపై ఎన్ని ఫిరంగులున్నవో తెలుసుకోవాలి. నౌకల సంఖ్యలోను, ఫిరంగుల సంఖ్య సైజులోను జపానుకన్న అమెరికాదే పైచేయిగా నుంది. జపాను తలపెట్టిన క్రొత్త యుద్ధ నౌకలు రెండు నిపిమ, టకమాట్సు అనునవి అపుడే పూర్తియై పనిలోనున్న వనుకొందాం. అమెరికా క్రొత్త యుద్ధ నౌకలగు నార్తుకరోలిన వాషింగుటనులకు యివి ప్రతిగానుండును. అప్పటికీ జపానుతో యుద్ధము ప్రారంభమగు సరికి అమెరికాకు 17, జపానుకి 12 యుద్ధ నౌకలుండును అప్పుడు అమెరికా యుద్ధ నౌకలలో ఫిరంగులు మొత్తము 16 అంగుళాలవి 42, 14 అం. 124, జపాను ఫిరంగులు 16 అం. 32, 14 అం —80

సంఖ్యలో తక్కువైనా తమ నౌకలు అతివడిగా పోగలవని అహోగొప్పగ జపాను చెప్పుకొనుచుండును జపాను సరి క్రొత్త నౌకలు గంటకు 30 నాట్సు, తక్కినవి 23 నాట్సు పోగలవు. అన్నిటికన్న తక్కువ వడిగా పోయేది 22½ నాట్సు పోతుంది. అమెరికా యుద్ధనౌకలలో అతివడిగా పోయే నార్తుకరోలినా వాషింగుటనులు రెండును గంటకు 28 నాట్సు,

# రష్యాలో ఒక క్రొత్తరకము జర్మను ఫైటరు ప్లేను (యుద్ధవిమానము) కూల్చబడినది



రష్యను సోవియెటు యుద్ధభటులు వారి ఆంటి యేర్క్రాఫ్ట్ తుపాకులవలన పడగొట్టగా మిగిలిన జర్మనీవారి క్రొత్తరకపు 'మెసర్‌స్మిట్' 109 F ఫైటరు విమానమును పరీక్షించుచున్నారు. వైమానికుడు ఓబర్ లెఫ్టినెంటు రీన్‌హార్డ్ హేన్ అనువతడు స్క్వాడ్రను లీడరు (విమాన దళాధిపతి)గా నుండి యుద్ధారంభమునుండి ఫ్రాన్సు, బ్రిటనులమీదికి దాడి తీయుచుండెను. ఇప్పు డతడు సోవియెట్ వారి చేతులలో ఖైదీగానున్నాడు.

---

తక్కినవి 21 నాట్సు, మూడుమాత్రం 20½ నాట్సు పోగలవు.

జపాను నౌకలన్నియు 1934 సం॥లో మరమ్మతుచేసి ఆధునిక యంత్రసామగ్రితో సమర్చబడినవని జపాను చెప్పుకొనుచున్నది. అమెరికా నౌకలలో 10 మాత్రమే ఆధునిక యంత్రసామగ్రితో సమర్చబడినవి గనుక తమ నౌకాబలమే ఎక్కువని జపానువారి వాదము. అమెరికావారి యుద్ధనౌకలు ఐదు 1920-వ సం॥లోను, రెండు 1931-వ సం॥లోను, తక్కినవి 1933—34-వ సం॥లోను క్రొత్త సామగ్రితో అమర్చబడినవి. ఇంకా ఐదు 1941-వ సం॥లో అమర్చబడవలసియుండెను కాని, వాటిని యీ పనికై రేవులుచేర్చి విశ్రాంతి నొసంగుటకు వీలు లేక పోయినది.

9,000 టన్నుల బరువుకు పైబడిన బరువైన క్రూయిజరు తరగతి యుద్ధనౌకలు అమెరికాకు 27 గలవు. జపానుకు అట్టివి 8 మాత్రమే గలవు. తేలిక క్రూయిజర్లు జపానుకి 27, అమెరికాకు 14 గలవు.

బరువైన క్రూయిజర్లలో వ్యత్యాసం తొలగించుకోడానికని జపాను నాల్గు "పాకెటు బాటిల్‌షిప్పులు" కట్ట దలచెను. అందొకటి కట్టుట పూర్తియైనది. మిగిలిన మూడు 1941 లో పూర్తికావలసి యుండెను. ఇవి 12 నుండి 14 వేల టన్నుల బరువు గలవియు ఆరు 12 అం. పండ్రెండు 5 అం. ఫిరంగులు గలవి.

విమానాలను మోసుకపోయే యుద్ధనౌకలు జపానుకి 13 వాడుకలో నున్నవనియు, మరిరెండు క్రొత్తగ తయారయినవనియు యిటీవల వార్తలు తెల్పుచున్నవి. ఇటువంటివి అమెరికాకు యిన్ని లేవు. ఏడు వాడుకలో నున్నవి 12 కట్టబడుచున్నవి. అమెరికా విమాన వాహకనౌకలు జపానువాటికన్న పెద్దవి. వాటి బరువు 11,500 టన్నులనుండి 33,000 టన్నుల వరకు యుండును. జపానువి రండుమాత్రం 26,900 టన్నులు, మిగిలిన 11 లో కనీసం ఐదు నౌకలు 10,000 టన్నులకు తక్కువ బరువైనవే.

నీటుదిగే విమానాలను మోసే యుద్ధనౌకలనే జపాను ఎక్కువ కట్టింది. కనీసం మూడు అటువంటివిగలవు. ఆరు సామాను నౌకలను నీటి విమాన వాహకనౌకలుగ మార్చుటకు జపాను నౌకాదళాధికారులు ఉత్తరువు చేసిరి.

ఈ దిగువ పట్టీనిబట్టి జపాను అమెరికాల యుద్ధనౌకాదళముల తారతమ్యము తెలియగలదు:—

## జపాను

| యుద్ధనౌక పేరు. | పూర్తియైన సం॥ | టన్నులు. | గమనవేగము గంటకు నాట్సు. |
|---|---|---|---|
| నిషిమ | 1941 | 35,000 నుండి | 30 |
| టకమాట్సు | ,, | 40,000 | ,, |
| ముట్సు | 1921 | 37,720 | 24 |
| నగాటో | 1920 | ,, | ,, |
| హరునా | 1915 | 29,330 | 26 |
| కిరిషిమా | ,, | ,, | ,, |
| కాంగో | 1913 | ,, | ,, |
| హీ యేయి | 1914 | ,, | ,, |
| హైయూగ | 1918 | 29,990 | 23 |
| ఈజి | 1917 | ,, | ,, |
| ఫూజో | 1915 | 29,330 | 22½ |
| యమషిరో | 1917 | ,, | ,, |

## అమెరికా సంయుక్త రాష్ట్రములు

| యుద్ధనౌక పేరు | పూర్తియైన సం॥ | టన్నులు | గమనవేగము గంటకు నాట్సు |
|---|---|---|---|
| నార్తుకరోలిన | 1941 | 35,000 | 28 |
| వాషింగుటను | ,, | ,, | ,, |
| ఇడాహో | 1919 | 33,400 | 21½ |
| న్యూమెగ్జికో | 1918 | ,, | ,, |
| పెన్సిల్వేనియా | 1916 | 33,100 | 21 |
| మిస్సిసిప్పీ | 1917 | 33,000 | ,, |
| అరిజోనా | 1916 | 32,600 | ,, |
| కాలిఫోర్నియా | 1921 | ,, | ,, |
| కొలొరేడో | 1923 | 32,500 | ,, |
| టెన్నేసి | 1920 | 32,300 | ,, |

| యుద్ధనౌక పేరు | పూర్తియైన సం॥ | టన్నులు. | గమనవేగము గంటకు నాట్సు |
|---|---|---|---|
| వెస్టు వర్జినియా | 1923 | 31,800 | 21 |
| మేరీలాండు | 1921 | 31,500 | ,, |
| నివాడా | 1916 | 29,000 | 20½ |
| ఒక్లహోమా | ,, | ,, | ,, |
| న్యూయార్కు | 1914 | 27,000 | 21 |
| టెక్సాసు | ,, | ,, | ,, |
| అర్కన్సాసు | 1912 | 26,100 | 20½ |

పసిఫికు సముద్రంలో యుద్ధం ప్రారంభమయినపుడు యీ సంఖ్యలు తయారు చేయబడినవి

# జపానీయులు, చైనీయులు

### భేదం తెలుసుకొనే విధం

జపానువారు చీనావారు యించుమించు ఒకే లాగుంటారు. వారిని చాలకాలంనుండి చూస్తున్నా క్రొత్తవారు కనబడితే గభీమని వారు జపాను దేశీయులో చీనాదేశీయులో తెలుసుకోవడం కష్టం. జపానీయులు మనకు శత్రువులు చీనావారు మన మిత్రులు. కనుక జపానీయులు కొన్నిచోట్ల చీనావారిగ మెలగి తప్పించుకోవచ్చును. అందుకై వారిమధ్య గల వ్యత్యాసం, వేరువేరు లక్షణాలు తెలుసుకొనుట మంచిది.

1. పై చూపుకి: — సామాన్యంగా జపానువారు చేతులు పై భాగం పొడవుగానుండి, కాళ్లు పొట్టిగనుండి వంకర దొడ్డికాళ్లుగ నుండును కార్షిక జనం విశాలమయిన ఛాతీకలిగి చేతులు కాళ్లు పిక్కలు బలిసియుందురు. నగరాలలో నుండే వారు నీరసంగానుండి కండ్లకు తప్పకఅద్దాలు పెట్టుకుంటారు. పెక్కుమంది జపానువారు ముఖ్యంగా సిపాయీలు అదోవిధంగా "దడదడ"మని నడుస్తారు.

చీనాజాతివారు తీర్చి దిద్దినట్లు అంగసౌష్టవం గల్గియుందురు. వెన్ను వంగకుండాయుండును, పిర్రల వద్ద సన్నంగానుందురు—స్త్రీలు పురుషులుగూడా.

2. మాటలు — జపానీయులు ఎక్కువమంది లకారం పలుకలేరు. ఉదాహరణకు "లాహోరు" అనుటకు బదులు 'రాహోరు' అంటారు. చీనావారు దీనికి ప్రతిగా, రకారానికి బదులు లకారం పలుకుతారు. "వెరీ" అనుటకు బదులు "వెలీ" అంటారు.

జపానుభాషలో అచ్చులు ఇటలీభాషలో వలెను నుండును ఒత్తిపలకరు.

చీనాభాష ఇంగ్లీషుభాషను పోలియుండును. శబ్దం ఉచ్చారణ గమనార్హములు.

(3) అలవాట్లు—జపానువారు మర్యాదకు వంగినపుడు నడుముదగ్గరనుండి వంగుతారు. చీనావారు తరుచు వంగనేవంగరు. మిత్రులను కలుసుకొన్నపుడు జపానీయులు వంగి, అట్టహాసంతో పలుకరింతురు. చీనావారికి యీ విషయంలో ప్రత్యేక లక్షణమేదియు లేదు. కాని పూర్వాచారం ప్రకారం కరస్పర్శ గావించుకొందురు. జపానువారు నేలను కాళ్లు ముడుచికొని కూర్చొనుటకు అలవాటుగలవారు. కుర్చీలమీదగాని నేలపీటలమీదగాని కూర్చోనొల్లరు. చైనీయులు కుర్చీలకు అలవాటు పడ్డారు. చీనావాడు పరుపుమీద కూర్చుంటాడు. జపానువాడు నేలకూర్చుండడానికి యిష్టపడతాడు.

# విజయమార్గం—విమోచనమార్గం

యుద్ధంలో శత్రువును సాధించడం కేవలం యోగసాధనవంటిది — ఇటువంటి అఖిల ప్రపంచ సంగ్రామములో, ప్రపంచములోని అన్నిరాజ్యాల వారూ రణరంగములోకి దిగి పోరాడుచున్నప్పుడు ఇది ప్రపంచవిలయమేగాని మరొకటికాదు. ఈ రోజున ఈ సంగ్రామంవల్ల కష్టనష్టములను అనుభవించనటువంటి రాజ్యం ఒక్కటికూడా యీ ప్రపంచంలో లేదు—ఇటువంటి మహాప్రపంచ విలయంలోనుంచి బ్రతికి బయటపడవలెనంటే భగవంతుని సహాయం ఉండి తీరాలి—భగవంతుని సహాయం ఏవిధంగా, ఏ సమయంలో ప్రాప్తించగలదో మానవ మాత్రుడు చెప్పలేడు. ప్రాణాలమీద ఆశ వదలుకొన్న సమయంలో ప్రాణదానం చేస్తాడు భగవంతుడు. భగవత్సంకల్పం ఎటువంటిదో ఎవరికీ ముందుగా తెలియదు సీలుచేసిన కవరులోని సంగతులైనా సరే, లకోటా ప్రశ్నలు చెప్పగలవాళ్లు, కవరు విప్పకుండా చెప్పగలరేమోగాని, భగవత్సంకల్పమును వివరించి ముందుగా చెప్పగలవాళ్లెవ్వరూ లేరు. "ఈశ్వర సంకల్ప మెవ్వారెరుంగుదురు' ఏరీతి యెట్లుండునో"—హరిశ్చంద్ర నాటకంలో కథ ఎట్లా ఉంటుందో చూడండి! సత్యమును విడనాడకుండా, ఆడినమాట తప్పకుండా, చేసిన ప్రమాణములను శిరసావహిస్తూ, హరిశ్చంద్రుడు తన రాజ్యాన్ని వదలుకోవలసి నప్పటికీ అందుకు సిద్ధమై సత్యమార్గమును మాత్రము విడనాడలేదు. తనకుగల ఒక్కడే కుమారునికూడా, పోగొట్టుకున్నాడు. తన భార్యయైన చంద్రమతినికూడా బానిసగా అమ్ముకొని, ఆమెనుకూడా తానే చంపవలసిన స్థితికి వచ్చాడు. ఆ చక్రవర్తికూడా ఆఖరుకు కాటికాపరియైనాడు. మహాచక్రవర్తి శ్మశాన చక్రవర్తియైనాడు. కాని, చిట్టచివరకు ధర్మమే జయించింది. సత్య హరిశ్చంద్రుడే సర్వలోక ధర్మప్రతిష్ఠాపకుడైనాడు. ఈ హరిశ్చంద్రకథలో అమోఘమైన అంతరార్థం ఉంది.

చిట్టచివరకు జయించేది ధర్మపక్షమేగాని, అధర్మపక్షముకాదు. తాత్కాలికంగా అధర్మమే ప్రబలమైనట్లుగా కన్పిస్తుందిగాని, యీ ప్రాబల్యం కేవలం తాత్కాలికమేగాని, స్థిరమైన ప్రాబల్యంకాదు.

మన జార్జిచక్రవర్తిగారు తమ సామ్రాజ్యంలోని ప్రజల కందరకూ అదేవిధంగా ఒక దివ్యమైన ఉపదేశం చేస్తూ రేడియోద్వారా ప్రసంగంచేశారు. "తమోగుణమే ప్రధానముగా కలిగినటువంటి ప్రబలమైన శక్తులతో మనమిప్పు డొక ధర్మయుద్ధం చేస్తున్నాము. దుష్ట శిక్షణార్థమై మనము కత్తికట్టి పోరాడుచున్నాము ఈ దుష్టగణము యీ మహాసమరములో ప్రబలమై పైకి వచ్చినయెడల, ప్రపంచంలో ఇక ప్రజాస్వాతంత్ర్యం అనేది నశిస్తుంది. క్షమ, సహనము, దయ, దాక్షిణ్యం మొదలైన సాత్వికగుణములు పూర్తిగా లోకంలో అంతరించగలవు. క్రూరరాక్షసత్వం ప్రబలమై పోతుంది" అని జార్జి చక్రవర్తిగారు చెప్పిన మాటలు యీటెపోటులవంటివి. అవి రామబాణముల వంటివి. రాజ్యాధిపతులైనవారు భగవంతుని సాక్షిగా వ్రాసి యిచ్చిన ప్రమాణపత్రములను చిత్తుకాగితములతో సమానంగా తృణీకరించి త్రోసివేసినట్లయితే, ప్రభువులు చేసిన వాగ్దానములను ప్రభువులే చెల్లించకపోతే, అంతకన్నా కపటనాటకం ఇంకొకటి ఉండదు. అంతకన్నా, అధర్మం ఇంకొకటి ఉండదు. హిట్లరు ఎన్ని ఒడంబడికలు, ఎన్ని ప్రమాణపత్రాలు వ్రాసి యిచ్చాడు? ఎన్ని పర్యాయములు అటువంటి ఒడంబడికల నన్నింటినీ, గాలిపటములవలె ఎగురగొట్టి, "నా మాటమీద నిలువబడవలసిన అగత్యం నాకు లేదు" అని ధిక్కరించి, అహంకారంతో, హుంకరించాడో లెక్కపెట్టలేము.

రష్యామీదకు తన సేనలను అకస్మాత్తుగా పంపించి మిత్రద్రోహం చేశాడు. నమ్మించి మోసం చేశాడు. తన జర్మనీ దేశంలోనే తన నాజీపార్టీకి ప్రతికూలంగా అభిప్రాయధోరణి కనబరచినవాళ్లనందరినీ అరెస్టుచేసి, నిర్బంధ ప్రవాసాలలో ఉంచి, ఘోరమైన హింసలుపెట్టి, హతము చేస్తున్నాడు. పెద్దపెద్ద నాయక ప్రముఖులైన సైనికాధికారులను, జర్మను ప్రముఖులను ఒక్కనాటి రాత్రి తనంతటతానే రివాల్వరుతో కాల్చి చంపివేసినాడు తనయొక్క అధికార ప్రాబల్యం విజృంభించుటకు వారు ఆటంకములను కల్పించగలరనే అనుమానంచేత అర్ధరాత్రివేళ ఆ ఘోరమైన హత్యలు యీ హిట్లరు చేశాడు, చేయించాడు. సహనము, అనేది అతని రక్తంలోలేదు. హిట్లరు యీ యుద్ధంలో నెగ్గినట్లయితే, జార్జి చక్రవర్తిగారు చెప్పినట్లుగా సహనముగాని, యితరుల అభిప్రాయ భేదాలనుకూడా సహించి గౌరవించడంగాని, ప్రజలకుగల అభిప్రాయ స్వాతంత్ర్యంగాని, వాక్స్వాతంత్ర్యంగాని యీ ప్రపంచంలో ఇక ఉండవు. గత ఐరోపాయుద్ధం ముగిసినప్పుడు వర్సేల్సు సంధిపత్రం వ్రాసికొనబడెను. ఆ సంధిపత్రములో జర్మనీ సంతకం చేసింది. అది గాక లొకర్నో ఒడంబడికలోకూడా జర్మనీ సంతకం చేసింది. కాని, "ఆ ఒడంబడికలను నేను శిరసావ

"హించను" అని హిట్లరుచెప్పి ఆ షరతులను ఉల్లంఘించుటకోసమే యుద్ధం చేస్తున్నానని బాహాటంగా ప్రకటించాడు. ఈ విధంగా రాజ్యాధిపతియైన వాడు ప్రవర్తిస్తే, ఇక యీ ప్రపంచంలో, ఒడంబడికలనే వాటికిగాని, ప్రమాణ పత్రములనే వానికిగాని, విలువ ఉంటుందా? చేసిన ప్రమాణములను చెల్లించవలెననే నీతిధర్మం ప్రపంచంలో నిలుస్తుందా? సత్యమనేది ఉంటుందా? మోసము, ద్రోహము, దుర్మార్గము, దౌర్జన్యము, క్రూరత్వము, నిర్దాక్షిణ్యము, లోకంలో పరిపాటిగా ప్రబలమై పోగలవు. నీతినశించి, అవినీతి విస్తరించగలదు.

ఇటువంటి దుష్టరాక్షసశక్తులు నేడు ప్రపంచంలో చెలరేగినవి. జర్మనీ పక్షమున జపాను చేరింది. ఇరుగుపొరుగు రాజ్యాలనన్నింటిని, అక్రమంగా మింగివేసి, తాను ఆధిపత్యం వహించి, ఆ దేశాల ప్రజలనందరిని పీడించి అష్టకష్టముల పాలుచేసి, తాను అష్టయిశ్వర్యములను అనుభవించవలెనని జపాను సంకల్పించింది జర్మనీతో చేరింది. జర్మనీతో యీ విధంగా చేరిన రాజ్యాలనన్నింటినీ "అక్షరాజ్యములు" అనే పేరుతో హిట్లరు పిలుస్తున్నాడు. ఈ అక్షరాజ్యాలు చేస్తున్న రాక్షస కృత్యాలు ఇన్నీ, అన్నీ కాదు హాంకాంగులోని బ్రిటిష్ సైనికులందరూ యుద్ధ ఖైదీలుగా జపాను వారికి లొంగిపోయినారు. అంతర్జాతీయ నీతి నియమ మర్యాదల ప్రకారంగా, యుద్ధ ఖైదీలను, యుద్ధం సాంతమయ్యేవరకు తగిన మర్యాదలతో పోషిస్తూ ఉండాలి. యుద్ధానంతరం జపానువారి వశమందున్న యుద్ధ ఖైదీలను జపానువారు విడుదల చెయ్యాలి. చైనావారి వశమందున్న యుద్ధ ఖైదీలను చైనావారు విడుదల చెయ్యాలి. ఇది అంతర్జాతీయ మర్యాద. ఈ మర్యాద ననుసరించి చైనావారు తమ వశమందున్న జపాను సైనికులను ఏలోపము లేకుండా చంకింగు సమీపములో ఉన్న ఒక నిర్బంధ ప్రవాసంలో పోషిస్తూ ఉన్నారు. కాని, జపానువారికి హాంకాంగులో లొంగిపోయిన బ్రిటిష్ సైనికులను జపానువారు కాళ్లు చేతులు కట్టి కత్తులతో పొడిచి చంపివేశారు. జపానువారు చేసిన యీ రాక్షస కార్యములు నిజమని రూఢిగా ప్రత్యక్ష సాక్షులద్వారా ఋజువైనది ఈ వివరముల నన్నింటిని, బ్రిటిష్ విదేశాంగమంత్రియైనయీడెనుగారు లండనులో పార్లమెంటుసభలో బహిరంగంగా వర్ణించిచెప్పారు. గరుడ పురాణంలో వర్ణింపబడిన నరకలోక బాధలనుకూడా మించిన క్రూరరాక్షస కార్యాలు ఇవి.

ఇంతకన్నా ఘోరమైన పనులు జర్మనీవాళ్లు చేసారు. యుద్ధంలో దెబ్బలు తగిలినవారిని, దిక్కులేక పడియున్నవారిని రక్షించి, వారికి వైద్యసహాయం చెయ్యడంకోసం "రెడ్ క్రాస్ సంఘం" అనేది ఒకటి ఏర్పడి ఉన్నది ఈ రెడ్ క్రాస్ సంఘం కేవలం పరోపకారమే తమ విధ్యుక్తధర్మంగా భావించి పని చేస్తూ ఉంటుంది ఇది "ఆర్తత్రాణ సంఘం" ఈ సంఘమువారికి శత్రువనిగాని మిత్రుడనిగాని పక్షపాతములేదు. ఏ మానవుడైనాసరే దురవస్థలపాలై పడిఉంటే, వానిని రక్షించడమే వీరిపని. దుఃఖార్తులైనవారిని రక్షించడమే "ఆర్తత్రాణ సంఘము"వారియొక్క పని ఈ రెడ్ క్రాస్ సంఘమునకు చెందిన కొన్ని ఆస్పత్రి నావలమీద జర్మను విమానాలు బాంబులు వేసినవి. ఆ నావలలో ఉండేది డాక్టర్లు, నర్సులు, రోగులు తప్ప మరెవ్వరూ ఉండరు. అటువంటి పుణ్యకార్య పరాయణులైన రెడ్ క్రాస్ సంఘమువారి నావలమీదగాని, వారి మకాములమీదగాని బాంబులు వేయడంకూడదనిన్నీ, అది గొప్ప పాతకమనిన్నీ అన్ని రాజ్యాలవారూ ఒక షరతు నియమము చాలా కాలంక్రిందటనే ఏర్పరచుకొని, ఆ నియమమును అనేక యుద్ధాలలో శిరసావహిస్తూ ఉన్నారు. జర్మనీవారుకూడా యీ నియమం పాటించుటకు ఒప్పుకొనియున్నటువంటివారే. కాని, తాము ఒప్పుకొన్న నియమమును తామే ఉల్లంఘించి, రెడ్ క్రాస్ సంఘపు నావలమీదనే బాంబులు వేస్తున్నారు. జర్మను విమానాలు బాంబులువేసి ధ్వంసంచేసిన ఆస్పత్రులు ఇన్నీ అన్నీ కాదు అశక్తులైన రోగులు ఉన్నటువంటి ఆస్పత్రులమీద బాంబులు వెయ్యడం కేవలం రాక్షస కృత్యం. ఈ రాక్షస కృత్యాలకు జర్మను విమానాలు వెనుదీయడంలేదు. జర్మనీ వాళ్లు యుద్ధం ప్రకటించిన వెంటనే చేసిన పని ఏమిటంటే, స్త్రీలను పిల్లలను ఎక్కించుకొని అమెరికాకు ప్రయాణం చేస్తున్న ఒక పెద్ద ప్రయాణికుల నావను నట్టనడిసముద్రంలో ఘోరంగాముంచివేశారు. ఇటువంటి మహా పాతకముతో జర్మనులు యుద్ధంప్రారంభించారు. ఇటువంటి పాతకములతోనే యింకా యుద్ధం చేస్తున్నారు. నీతిగాని, నియమంగాని, న్యాయంగాని, ధర్మంగాని, అవసరంలేదని భావించి ఘోరంగా రాక్షసంగా ప్రవర్తించే అక్షరాజ్యాలతో నేడు బ్రిటిష్ వారు యుద్ధం చేస్తున్నారు. అందుకనే జార్జి చక్రవర్తిగారు అన్నారు "దుష్ట శిక్షణార్థమై మనము కత్తికట్టి పోరాడుచున్నాము" అని చెప్పారు.

PRINTED BY V M PHILIP AT THE DIOCESAN PRESS, 18 CHURCH ROAD, VEPERY, MADRAS